# గాంధీజీ యుగపురుషుడు

మన ప్రధాని తలపెట్టిన 20 సూత్రముల కార్యక్రమం ఇందులో చేర్చబడినది.



రచయిత:

యం. వి. స్వామి గుప్త




వెల రు. 1-25 పైసలు.



# అంకితము



కడప మండలాధిపతి (జిల్లా కలెక్టరు)

శ్రీ **P. L. సంజీవరెడ్డి I. A. S.** గారి సలహా ననుసరించి



అఖిల భారత ప్రజలచే గుర్తించిన సేవాగ్రామంలో
(మధ్యప్రదేశ్) గాంధీజీ స్థాపించిన ఆశ్రమ సెక్రటరియును.

మరియు

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు 20 సూత్రముల ప్రచార
కమిటి సభ్యులును.
ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సంఘం అధ్యక్షులును.

## పూజ్యశ్రీ ప్రభాకర్ జీగారి

నిరంతరమైన సేవాదృష్టిలో
సర్వోదయ ప్రచారకుడగు నాపైవున్న ప్రేమాభిమానము
పురస్కరించుకొని యీ చిన్న కానుకను శ్రీ ప్రభాకర్ జీవారికి
సమర్పించుకొంటున్నాను... స్వామిగుప్త.



విక్రయ డబ్బును బద్వేలులో మఠం పునరుద్ధణకు వినియోగించబడును.

జై హింద్.                    జై జగత్.

# గాంధీజీ యుగపురుషుడు





మరుగున పడిపోయిన మహాత్మాగాంధీ
విధానం ప్రోత్సహించి సమగ్రమైన
స్వరాజ్య సంపాదనకై గాంధీ
విధానం చదవండి.
చదివి చెప్పండి.

రచయిత:
యం. వి. స్వామి గుప్త.

ద్వితీయ ముద్రణ - కొద్దిమార్పులతో
1977 జనవరి



మూల్యము రు 1-25

ప్రతులు: 2000



విడిప్రతులు కావలసినవారు
యం. వి. సుబ్బరావు
హౌసైటి కాలని, ప్రొద్దుటూరు

పబ్లిషర్సు:
సర్వోదయ విద్యాపీఠం
వినోబాజీనగర్
బద్వేల్ (పోష్టు) కడప జిల్లా.

ముద్రణ:
సారథిప్రెస్, ప్రొద్దుటూరు.

# స్వ వి ష య ము.

ప్రపంచ జీవకోటిలోని 84 జీవరాసులలో మానవ జన్మపవిత్రాత్మకమైనదని మన వేదాంతులేగాదు మన పెద్దలుకూడ అంటున్నారు. కాని మానవజాతి సకలైశ్వర్య సంపదలతో నొకవైపు భోగవిలాసము లనుభవిస్తుండగా నొకవైపు దారిద్ర మనుభవించుతూ ఇల్లు-వాకిలి-కూడు. గుడ్డకు నోచుకొనని మానవ ప్రజలనేక మంది యున్నారు, యీ కారణములను పురస్కరించుకొని మన వేదాంతులు మన పెద్దల ఉద్దేశము అసద్దముగా భావించరాదు.

ప్రపంచ జీవకోటిలో మా న వు డు వివేకవంతమైన ప్రాణి. మానవునికి అన్ని అవయములతో కూడిన ఆధ్యాత్మిక నైతిక విలువ పెంచుకొనే మార్గములు లేకపోలేదు. కాబట్టి మానవుడు సోమరితనానికి స్వస్తిచెప్పి జ్ఞానదృష్టితో కర్మ జీవితము గడుపుకొంటూ పరిశుద్ధమైన శాంతి సహృద్భావము పెంపొందించు కొన్నవారికి యే ప్రజాస్వామ్య దేశంలోనైనా దారిద్ర్యం అంటజాలదు. దా రి ద్ర్యా ని కి కారణము అజ్ఞానమనక తప్పదు.

యీ ఉద్దేశముతో గాంధిజీ మానవ సమస్యలు పరిష్కరించుటకై బానిస తనము నిర్మూలించి స్వాతంత్ర్య పౌరులుగా మార్పుకావించుటకే కలుషితమైన రాజకీయరంగములో ప్రవేశించి రాజకీయ స్వాతంత్ర్యమును ప్రసాదించాడు. కాని నేటి పాలకవర్గము గాంధేయవాదులకు ప్రారంభమునుండి తగిన ప్రోత్సాహమివ్వక వారి సలహాలు పాటించని ఫలితమే దేశ ఆర్థిక సంక్షోభానికి కొంత కారణమనికూడ చెప్పవచ్చును.

1940-41 నుండి ఆంధ్ర దేశములో స్వాతంత్ర్య ఉద్యమము ముమ్మరముగా సాగిపోతున్నది. పల్లె పల్లెలో కాంగ్రెసు నాయకుల

ఇకపోతే గాంధీ నిర్యాణాంతరము గాంధీజీ అధ్యాత్మిక వారసుడగు వినోబాజీ నాయకత్వమున భారత ప్రజలకు ప్రభుత్వానికి సన్నిహితం పెంపొందించుటకు భారత దేశమంతా పాదయాత్ర సాగించి భూదాన గ్రామదాన ఉద్యమముద్వారా నైతిక ప్రచారము గావించడమే గాక కొన్ని లక్షల ఎకరముల భూపంపకము గావించి భూసంస్కరణ బిల్లులను రూపొందించుటలో ప్రభుత్వానికున్న సందేహముల నివారించి ప్రజల సంక్షేమానికై అనేక మార్గముల చూచించుచున్నారు.

ఇట్టి సందర్భములో 20 సూత్రముల ఆర్థిక ప్రణాళిక విజయానికై సర్వోదయ సిద్ధాంతము రీత్యా గాంధేయవాదులు సేవా కార్యకర్తలు తమ కర్తవ్యమును విస్మరించక అహింస, శాంతియుత మార్గములో సర్వ మానవ సోదరత్వము పెంపొందించుటకై యీ క్రింది సూత్రముల పాటించవలసివున్నది.

మన దేశములో జీర్ణించి పోయిన అధికారతనము, ధనికతత్వము తగ్గించి 20 సూత్రముల విజయానికై చెలరేగుతున్న విధానమంతా సత్యము–అహింస–దయకు ప్రతిరూపమైన బలవంతులు–దుర్బలుల కొరకు–ధనవంతులు, దరిద్రులకొరకు–విద్యావంతులు, విద్యాహీనులకొరకు జ్ఞాని, అజ్ఞానులకొరకు ఉద్యోగి, నిరుద్యోగులకొరకు నిరంతరమైన కృషి. సాగించుతూ, మానవుల దృక్పధము మార్చగలదను సంకల్పముతో యీ గ్రంధము పాఠకుల ముందుంచ బడుతున్నది.

జై జగత్.

ఇట్లు,
రచయిత,

ఆంధ్రప్రదేశ్ భూదానయజ్ఞ బోర్డు అధ్యక్షులు శ్రీ సి. వి. చారిగారి

# ఒ క మా ట

మిత్రులు శ్రీ యం. వి. స్వామిగుప్త చిరకాలంగా నిర్మాణ కార్యక్రమాలలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తూ వచ్చారు. సర్వోదయ విద్యాపీఠం పేరవారు గాంధిజీ తత్వ ప్రచారమునకై సాగిస్తూన్న కృషి శ్లాఘనీయం. పెద్దగా చదువులు చదవకపోయినా చిత్తశుద్ధితో కూడిన సంస్కారం గల వ్యక్తి. గాంధీదేశంలో గాంధీజముకే తావు సన్నగిల్లి పోతూంటం చూస్తూ క్షోభచెందుతూన్న వారిలో శ్రీ గుప్తాగారొకరు.

ఇటీవల కాలంలో గాంధిజీ నిర్మాణ కార్యక్రమం పట్ల. ఆయన అశ్రుతర్పణం జరిపే దరిద్ర నారాయణుల పట్ల మన ప్రభుత్వాల దృష్టి మరలింది. ఇది భారత జాతీయ జీవనంలో ముదావహమైన పరిణామము-దేశ భవిష్యత్తున కది శుభసూచకము.

ఐతే యీ దేశంలో గాంధిజీని జూడనివారు, ఎరుగనివారు వున్నారు. ఇట్లే మరికొన్ని దశాబ్దాలు గడిచిపోతే గాంధిజీని జనం మరచిపోయినా ఆశ్చర్యం చెందనవసరం వుండదు. గాంధిజీ బోధలను అడుగడుగునా, అనుక్షణం. జాతి దైనందిన జీవనంలో ప్రస్ఫుటింప జేయుటకు గాంధిధేయవాదులందరి. ప్రథమ కర్తవ్యం ఈ తత్పరతతోనే శ్రీ గుప్తాగారు గాంధి తత్వమును. గాంధిజీని గురించి తమకు తెలిసినంతలో తమకు తోచిన రీతి యీ చిన్న పుస్తకంలో చిత్రీకరించారు.

సముద్రానికి ఎల్లలులేవు. అల్లే గాంధిఇజం అని మనం చెప్పుకునే గాంధేయ బోధనలకూ అంతు అనేది లేదు. సామాజిక రంగంలోను' వ్యక్తి జీవనరంగంలోను ప్రతి చిన్న విషయానికి గాంధేయపంధా యేదో ఒక సందర్భంలో యేదో ఒక రూపంలో నిర్ధరింపబడియేవున్నది. గాంధేయ సాగర మధనం జరిపి అమృతమును చిలకరించుటే యీనాటి. మరి యేనాటి సామాజిక పెద్దలందరి పరమ ధర్మము. "సర్వేజనాః శుభనో భవంతు" అన్న విశ్వమానవ కళ్యాణ సాధనకు గాంధేయపంధా వినా మరోమధ్యే మార్గంతరిని సర్వత్రా గుర్తింపబడుతున్న యీ తరుణంలో గాంధీ దేశస్థులమైన మనపై మరింత గురుతర భావము. బాధ్యతలు వున్నాయి. మారుతున్న ప్రాపంచిక పరిస్థితుల కనువుగా గాంధి బోధన లను. గాంధేయపంధాను తీర్చిదిద్ది ప్రపంచానికే వెలుగును ప్రసాదించ వలసిన ధర్మం మనది. ఈ ధర్మ నిర్వహణ కనుగుణంగా సర్వోదయ విద్యాపీఠములు. గాంధేయ మార్గపఠన కనుగుగా అలంకరించుకొని గాంధి జ్యోతిని భూమండలం మంతటా ప్రసారితం చేయటానికి పూను కోవలసి వున్నది. ఈ మహత్తర బాధ్యత నిర్వహణంలో గాంధేయ పధము ననుసరిస్తున్నాయనుకునే మన ప్రభుత్వాలు చిత్తశుద్ధితో సహాక రించడం ఎంతైనా అవసరం.

చంద్రుడంతటి వానిలోనే మచ్చ వున్నది. అటులనే గాంధీజీ అనుచరులలోను, గాంధేయ కార్యకర్తలలోను మానవ సహజమైన లోట్లు వుండవచ్చు. ఈ లోసుగులకొరకై రంధ్రాన్వేషణ జరుపుకుంటూ కాలమును వ్యర్థపరచుకోక, మంచిని మాత్రమే గ్రహించి మంచిని పెంచే మార్గమును అనుసరించవలసి వుంటుంది. అదిలేనిచో తొల్లిటి

జీవమును. కోల్పోయిన భారత జాతీయ చరిత్ర పునరావృతమయ్యే ప్రమాదము ఉత్పన్నం కావచ్చు. వారన్నట్లు పాలకవర్గం గాంధేయ వాదులకు ప్రారంభమునుండి తగిన ప్రోత్సాహం యివ్వక. వారి సలహాలు పాటించని ఫలితమే " యీ నాటి ఆర్థిక సంక్షోభానికి కొంత కారణం" అని అంగీకరించక తప్పదు.

అందువల్లనే శ్రీ గుప్తాగారు పండిత సిద్ధాంత ప్రకర్షకు ప్రతి నిధిగాకున్నా. వారి ఆత్మ క్షోభను యీ చిన్న పుస్తకంలో ప్రకటించు కున్నారు.

జై జగత్.

సి. వి. చారి,
ఆం. ప్ర. భూదాన యజ్ఞ బోర్డు అధ్యక్షులు.

గాంధిభవనం,
హైదరాబాద్.
29-1-77.



ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువసమాఖ్య అధ్యక్షులు.

## జూటూరు వేమయ్య B. A. గారి

# ప్రకటన.

మిత్రులు యం. వి. స్వామిగుప్తగారు కడప జిల్లాలో సర్వోదయ ప్రచారకులుగా నేను "గాంధిజీ యుగపురుషుడు" అను యీ చిన్న గ్రంథమును రచించి గాంధి విధానమును ప్రజలకు ప్రభోదించుట. నేడెంతైనా ఆనందదాయకమై యున్నది.

దేశములో విప్లవాత్మకమైన మార్పులు చెందుతున్న యీ సందర్భములో సత్యము-అహింస-శాంతి-సహృద్భావముతో మన సమాజము పురోగమించవలసి వున్నది. శ్రీ మహాత్ముని భావములను తనకు తోచినట్లుగ ఈ పుస్తకరూపమున లిఖించి. సంఘములో ఉన్నత ఆశయములకు, సంఘమును జాతీయ దృష్టికి మరల్చుటకు ప్రయత్నించిన మిత్రుడు శ్రీ గుప్తాగారు ప్రశంసనీయుడు కుల, మతములకు అతీతముగా జాతీయ దృష్టిని ప్రజలలో పెంపొందించుట అవసరము. ఆ దృష్టిని పెంపొందించుటకు ఏ పరిధిలో ప్రయత్నించినను తప్పు లేదు. ఆర్యవైశ్య యువజన సంఘ సమాఖ్య ఆర్యవైశ్య యువకులలో నిద్రాణమై యున్న శక్తిని మేల్కొలిపి. జాతీయ కార్యక్రమములలో ముఖ్యముగా మన ప్రధాని 20 సూత్రముల ప్రణాళిక కార్యక్రమములో పాల్గొనునట్లు చేయడమే ముఖ్య ఉద్దేశ్యమై యున్నది

మిత్రుడు గుప్తాగారు అనేక సంవత్సరములుగా పరిచితులు అర్థికంగా కుంటుపడినప్పటికి ప్రజోప కార్యములందు మిక్కిలి ఆశక్తి చూపు వ్యక్తి తాను తలపెట్టిన ఈ సాహిత్య కార్యక్రమం విజయవంతం కాగలదని ఆశిస్తున్నాను.

ఇట్లు,

జూటూరు వేమయ్య, B. A.

ప్రొద్దుటూరు,

# సర్వోదయ విద్యాపీఠం! ఏమిటి! ఎందుకు!!

సర్వజన శ్రేయోభిలాషిగా ఆధ్యాత్మిక విప్లవం రేకెత్తించి సర్వ మానవుల స్వయం ఉపాది కల్పనకు మార్గదర్శియై జీవితం సాగిస్తూ నేటికి సమాధి నిష్ఠలోనున్న **శ్రీ బంగారు కొండావధూత స్వామి** వారిని గురించి ఆలోచించి పరిశీలించగా ఆయన హృదయం మథించిన విజ్ఞానశక్తి రాయలసీమలో ఒక మెరుపుతీగలా ప్రకాశించి మరుగై పోయినది. దివ్యశక్తి: ఆయన ప్రభావం మానవ జాతికి అధ్యాత్మికంగానేగాక స్వయం రాజా స్వయంమంత్రిగా జీవితాన్ని దిద్దుకోవలసిన సర్వశక్తులు ఆయనలో. నిబిడీ కృతమైవున్నవి.

మరియు ఇట్టి మహనీయునితో పోల్చి గిన పూజ్య వినోబాజీ కడప జిల్లాలో పర్యటించునపుడు జిల్లాలోనున్న వాతావరణ ప్రభావమును గుర్తించి రాష్ట్రములోని సేవాకార్య కర్తలందరు యీ జిల్లాను కేంద్రీకరించి పనిచేయండని సందేహమిస్తూ నవభారత నిర్మాణమునకు దోహదమిచ్చే అనేక మార్గముల సూశించియున్నారు.

యీ కారణములను పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ లో ప్రప్రథముగా బద్వేల్ తాలూకాను, సర్వోదయ ప్రాంతముగా నాయకులు ప్రకటించడము ప్రభుత్వము అదే సందర్భములో అనగా 1952-57 ప్రణాళికల ప్రారంభములో పోరుమామిళ్ళ బ్లాకు ప్రథమ శ్రేణిదిగను బద్వేలు బ్లాకు రెండవదిగా ప్రకటించడము జరిగినది. యీ విధముగా నాయకుల వాక్కు వృధాకారాదన్నట్లు, యీ కారణముల పురస్కరించుకొని కొండవధూత స్వామిఆశయ సాపల్యమార్గమునకై దీనికి 'సర్వోదయ విద్యాపీఠం' అను నామధేయముగా నిర్ణయించి ప్రభుత్వమునకుకూడా తెలుపుకోవడము జరిగినది. కాబట్టి ప్రజలు గుర్తించ కోరుచున్నాము.

# సూర్యోదయం

జైహింద్  జైజగత్

# సర్వోదయం

# గాంధీజీ యుగపురుషుడు

మానవుని అంతిమ లక్ష్యము దైవ సాక్షాత్కారము. కనుక ప్రతి మానవుని సాంఘిక రాజకీయ మత సంబంధమైన చర్యలన్నియు యీ అంతిమ లక్ష్యమగు దైవ సందర్శమునకు దారి చూపవలయును. సన్నిహిత సర్వమానవ సేవ యీ దైవ సందర్శన సాధనకు గాను చేయవలసిన కృషియందు తప్పక అచరించవలసిన యొక భాగము ఎందుకనగా దైవ సృష్టిలో ఆయనను చూచి అ సృష్టిలో నొకటిగా కలసి పోవుటయొకటియే ఆ దైవ సందర్శనమునకు మార్గము ఇది సర్వ మానవ సేవ వల్లనే సాధింపవలయును.

నేను సర్వమానవ కోటిలో నొకడను. మానవకోటికి బయట అయనను కలుసుకొనజాలను.

గాంధీ భారతదేశపు ప్రాచీన సంస్కృతీ తత్వాల ఆధారంగానే ఒక విశిష్టమైన క్రియా విధానాన్ని సృష్టించుకొని తద్వారా అతిక్లిష్టమైన నేటి భారతీయ ఆర్థిక రాజకీయ సమస్యలను పరిష్కరించ ప్రయత్నించి నాడు. విజయాన్నే సాధిస్తూవచ్చినాడు గాంధీజీ వివేక సంస్కారాలలో జరిపిన పరిశోధనల ఫలితంగా కొన్ని అపూర్వ సత్యసూత్రాలనా విష్కరించారు. అవి మానవ జీవన సాఫల్యానికి మూల కలదాల వంటివి.

గాంధీజీ జీవన లక్ష్యం తత్వ ప్రతిపాదనకాదు. కానీ మానవ జీవనానికి సంబంధించిన ఆయన పరిశోధనల ఫలితంగా ఆ విర్భవించిన సూత్రాలే ఒక మహత్తర పూర్ణమైన తత్వానికి పునాదులు వేశినాయి.

ఆయనచేత నిర్వహింపబడిన జీవన విధానం మానవుని అస్తిత్వానికి సంబధించిన ఆయన అభిప్రాయాలు ఈశ్వరునిపట్ల సృష్టిపట్ల ఆయన వ్యక్తీకరించిన భావాలు సర్వాంగణముగా పరిపుష్టమై ఒక నూతన తత్వశాస్త్రానికి పునాదులువేసి కావలసిన సాధన సంపత్తి నంతనూ, సుపరిష్కృత మొనర్చి మానవజాతికి సమాకూర్చినవని చెప్పవచ్చును.

గాంధీజీ అభిప్రాయ ప్రకారం జడవాదం మానవుని బాహ్య జీవితానికి సంబంధించినంతవరకు మాత్రమే, సమగ్రం, సానుకూలం మానవుని జీవితావసరాలకు సంబంధించిన భౌతిక వస్తు సముదాయానికే దానివల్ల సముచిత ప్రేరణ ప్రోద్బలం లభింపవలయునే కాని అతని ఆత్మిక మానసిక శక్తుల అకుంఠిత పరిచేదిగా మాత్రం ఉండకూడదు. ఆయన పదార్థానికంటె మానవశక్తిని నెక్కువ గౌరవించినాడు. ఆయన దృష్టిలో ఆత్మశక్తికి మించిన శక్తిలేదు. అదే మానవునకు పూర్ణాత్వాన్ని సిద్ధంపచేసేదని ఆయన పూర్తి నమ్మకం. మానవుని ఆత్మ విశ్వాసానికి అతని నైతిక, సంపదకు, సంబంధించిన అధ్యాత్మిక శక్తులను భౌతిక అవసరాలకు వినియోగించరాదు.

చేతన పదార్థంలో కలిగే భావపరివర్తనమే సృష్టి వికాసానికి దోహదమిచ్చునని ఆయన నమ్మకం. ముఖ్యంగా మానవుని నైతిక శక్తి క్రియాశీలముపైననే లౌకిత ప్రపంచ నిర్మాణం ఆధారపడియుందని ఆయన దృఢవిశ్వాసం. ఆయన సత్యాహింసల జీవితావసర రూపంలో ఆత్మశక్తినే బలంగా ప్రతిపాదించాడు. ఈ కారణం చేతనే మార్క్సిస్టు సిద్ధాంతం ప్రకారం సమాజంలో ముందుగా పరిష్కరించవలసిన ఆర్థిక విషమతకు ఆయన ప్రాధాన్య మివ్వలేదు. హృదయ పరివర్తనం కలుగకుండా ఆర్థిక సమానత్వానికి సాఫల్యం లభింపనేరదని ఆయన

విశ్వాసం. హృదయ పరివర్తనలేని, భావ, సామ్యం, లేక ఆర్థిక సమానత్వం అంతప్రయోజన కారికాదు.

గాంధీజీ ఆస్తికుడు ఆయన ఈశ్వరవాది మానవుని మరుషార్థాన్నవహేళనచేయక పోయినప్పటికిని ఆయన ఈశ్వరత్వంపై పూర్తిగా నమ్మకం ప్రకటించాడు. పరమమేశ్వరుని సాక్షాత్కారమే ఆయన దృష్టిలో మానవుని జీవిత లక్ష్యం. జీవితంలోని మిగతా కార్యకలాపాలన్ని యీ పరమ లక్ష్యంలోనే జరుగుతూవుండాలి. ఎందుకంటె ఆయన సిద్ధాంత ప్రకారం ఈశ్వరుడు సత్యజ్ఞాన స్వరూపుడు. మానవుని ఇంద్రియజ్ఞానానికి అతీతుడు. ఆదిమద్యాంత రహితుడు సమస్త బ్రహ్మాండానికి అతడు అదిపతి అతడు మినహా మిగతే ప్రపంచం నశ్వరమని ఆయన అభిప్రాయం. ఈశ్వరునికి "సత్యం" మారు స్వరూపమని ఆయన అంటూవుండేవాడు. ఈ సత్యాన్వాయన సమాజంలోనే చూడ సాధ్యమన్నాడు. ఘంటాపదంగా చెప్పకలిగినాడు. చెప్పడమేగాదు ఆయన ఆ విధంగా దర్శించాడుకూడా ఈశ్వరత్వమంటె పరిపూర్ణత్వం. పరిపూర్ణత్వ మాయనకు మానవ సమాజంలోనే గోచరమవుతుంది, వ్యక్తి సమాజ శ్రేయస్సుకొరకు చేసే త్యాగమే యీశ్వర సాక్షాత్కారానికి ఉపయోగపడే యోగసాధనమనుటలో ఆయన కిసుమంతైనా సందేహము లేదు. అదే ముక్తిమార్గమనికూడా ఆయన విశ్వాసం.

ప్రకృతిపై మానవుడు చేసే పరిశోధనలు ఆ ప్రకృతియొక్క జీవాతీతమైన మహత్తర శక్తికి లోబడే జరుగుచున్నవి. కాని ఆ మహాశక్తిని లోబరచుకొనుటకు మాత్రంకాదు అది కానేరదు. అని గాంధీ విశ్వాసం. ప్రకృతియొక్క మహాశక్తులలో గాంధీజీ ఈశ్వరత్వాన్నే అన్వేషించినాడు. అని ఈశ్వర ప్రేరితాలని వారి అభిప్రాయం వాటిని దిక్కరించటం మానవుని దుస్సాహసం.

అనేక సందర్భాలలో ఆయన ఈశ్వరత్వమంటె పరిపూర్ణత్వమని వ్యాఖ్యానించాడు. ఈశ్వరుడు పూర్ణత్వాని కలిగివున్నాడని సృష్టిలోని ప్రతిజీవి ఆసం పూర్ణత్వాన్ని కల్గివుందని ఆయన సిద్ధాంతం, ఈ లౌకిక జీవులలో మానవుడు వివేకంగల ప్రాణి. అతడు తన అసంపూర్ణత్వాన్ని తొలగించి దాని స్థానే పూర్ణత్వాన్ని సాధించేందుకు నిరంతరం కృషి చేస్తూవుంటాడు. అదే అతని జీవనలక్ష్యం. ఏనాడు మానవుడు పూర్ణత్వాన్ని సాధిస్తాడో ఆనాడు మానవుడు కాదు. అతనే ఈశ్వరుడు ఆ ఈశ్వరత్వాన్ని చవిచూచే ప్రయత్నంలోనే అతని జీవితం ముందుకు సాగుతూ వుంటుంది. అధ్యాత్మికంద్వారా అంటె సత్య అహింసలలో కూడిన పరిశుద్ధ నైకిక ఆచరణవల్ల ఆత్మ నిగ్రహం సాధించడంద్వారా పూర్ణత్వసిద్ధికి పరిశుద్ధ సాధనముగా వుంటుంది. పూర్ణత్వాన్ని సాధించాలంటె ఆ భేదభావాన్ని ప్రోత్సహించే ఆత్మ నిగ్రహ విధానమే శరణ్యము.

గాంధీజీ నిరీశ్వరవాది కాకపోయినప్పటికిని మానవుని లౌకిక ప్రతిపత్తిని మాత్రం తృణీకరించలేదు. ఈ లౌకిక జగత్తంతా మాయాత్మకమనే అద్వైతవాదుల అభిప్రాయంలో ఆయన ఏకీభవించలేదుఆయన అభిప్రాయ ప్రకారం లౌకిక సృష్టి మాయకాదు మిధ్యకాదు. ఒక విశిష్టమైన కార్యక్షేత్రం మానవుడు కర్తవ్య ప్రేరితుడుగానే యీ లోకములో జన్మిస్తున్నాడు. ఈ కర్తవ్యసాధనలో అతడు లోకంలోని జడజీవశక్తుల సహాయాన్ని పొందుతూ వస్తున్నాడు గాంధీజీ దృష్టిలో మానవుడు ఈశ్వరాత్మ సంభూతుడు గనుక ఈ లోకంలో మానవుడే మరొక మానవీయ శక్తికి బానిసగా నుండవలసిన అగత్యంలేదు. ప్రతివ్యక్తి ఆత్మస్వాతంత్ర్యాని కర్హుడు. ఆత్మస్వాతంత్ర్యం లోపించడమే జాతికైనా యే మానవునికైనా అత్యంత గర్హనీయం ఈశ్వరాత్మ సంభూతుడయిన మానవుని బానిసగా నుంచడం ఈశ్వరు నవమానించడం అవుతుంది.

ఈశ్వరత్వాన్ని గుర్తించినప్పటికిని గాంధీజీ ఈశ్వరత్వాన్ని ప్రతిపాదించిన పరలోకవాదుల సిద్ధాంతాలలో ఏకీభవించలేక పోయినాడు. పార లౌకిక జీవితంపై నమ్మకం వున్న భారతీయ దర్శనకారుడు. యాజ్ఞవల్క్యుడు వలె యీ లౌకిక జీవితపు భౌతిక అవసరాల కాయన ఉపేక్షించలేదు. యీ లౌకిక వాదాన్ని ప్రతిపాదించిన భా ర తీ య ఋషులలాగ ఆయన ఈశ్వరుని రూపగుణగణాల కతీతుడని భావించి సంతృప్తి పడలేదు. ఆయన దృష్టిలో ఈశ్వరుడు సత్య స్వరూపుడు ప్రేమగుణ విలసితుడు. ఈశ్వరునికొరకు లోకాను పేక్షించి ఇతర విధముగా ప్రాకులాడటం మన శక్తి నివృధా చేసుకోవడమే అవుతుంది.

గాంధీ విశ్వాత్మనే ఈశ్వరుడుగా అంగీకరించడ మవుతుంది అదే అఖండితము శాశ్వతము అని ఆయన విశ్వాసము ఇంకా విశేషమేమంటె మానవుని ఆత్మకు విశేష స్థానమిస్తూగూడా అది అరూపము సూక్ష్మము సులభ గ్రాహ్యముగానిదని గుర్తించి ఏవిధంగా వ్యక్తి యొక్క భౌతిక శరీరానికి భౌతిక అవసరాలకుకూడా ప్రాధాన్య మిచ్చారో అలాగే విశ్వాత్మను సులభగ్రాముచేయడానికి విశ్వాన్నే ఈశ్వరుడుగా స్వీకరించమని ప్రబోధించాడు. అంటె మానవసేవయే మాధవసేవ అనే సూక్తిద్వారా ఆయన వ్యక్తి యొక్క లక్ష్యం సమాజమేనని సమాజసేవయే వ్యక్తి కర్తవ్యమని అదియే సత్య స్వరోపుడయిన ఈశ్వరుని సాక్షాత్కారానికి ఏకైక మార్గమని ఉద్బోధించినాడు ఈ విధంగా ఆయన తన కర్మ ప్రబోధలద్వారా మానవుని లౌకిక జీవనస్థాయిని పెంపొందించినాడు.

గాంధీజీ జ్ఞానానికి కెక్కడ ప్రాముఖ్య మివ్వలేదు జ్ఞానానికంటె క్రియ గొప్పదనియు, తర్కంకంటె విశ్వాసం గొప్పదనియు ఆయన అభిప్రాయము. క్రియా నైపుణ్యముకొరకు మానవుడు జ్ఞానోపార్జనచేస్తూ వస్తున్నాడని దానిని ఆయన సమర్థించినాడు.

గాంధీజీ సాధ్యసాధనలలో భేదము చూపలేదు సాధన, సాధకుల పవిత్రత, లేక పరిశుద్ధినిబట్టియే సాధ్యం, అంటే ఆత్మశుద్ధి వ్యవహార పవిత్రతలేనిది సత్య స్వరూపుడైన ఈశ్వరుని సాక్షాత్కారము లభించదు. ఎందువలనంటె ఆత్మకు భిన్నమైన పరమాత్మలేదు. కనుక ఆత్మ రూపొందించుకొన్న పరిశ్రుత రూపమే ఆత్మను పరమాత్మ స్థాయికి చేర్చేందుకు సమర్థమైనది.

అందుచేత ఆయన ఈశ్వర సాక్షాత్కారాని ఆత్మ సాధనలో ముడిపెట్టినాడు. చెప్పడమేకాక ఆచరణలో చూపగల్గినాడు. వ్యక్తి జీవితములో నీతిని, ధర్మాన్ని పవిత్రతను ప్రోత్సాహించి సంఘ జీవితానికి శక్తి మివ్వగల్గింది ఈ అపూర్వ సిద్ధాంతమే.

గీత ప్రతిపాదించిన కర్మ సిద్ధాంతానికిది. వ్యవహారిక రూపం. కృష్ణుని తర్వాత కర్మ సిద్ధాంతాన్నింత విరివిగా సుబోదకంకా ఆత్మ విశ్వాసంతో ప్రబోధించి సర్వజనామోదాల్ని పొందగల్గిన మహనీయు డాయన. ఈ కర్మయోగి తన ఉపదేశాలు తదనుగుణమైన ఆచరణల ద్వారా మానవ సమాజానికి స్థిరమైన అలోచనా సంస్కారాన్ని క్రియా సంప్రదాయాన్ని ప్రసాధించినాడు. మానవ శ్రేయస్సే లక్ష్యంగా తన జీవన యాత్రను సార్థకం చేసుకొనగల్గిన గాంధీమహాత్ముడు మానవజాతికే చిరస్మరణీయుడు.



# భారత స్వాతంత్ర్య సమరములో గాంధీజీ శాంతిదూత!

గాంధీజీ అధ్యాత్మిక శక్తి యొక్క ప్రభావము గురించి మొదటి భాగములో చదివినారు. ఇకపోతే అస్వతంత్రులైన మానవులకు స్వరాజ్య సంపాదనకై దేశంలో జరుగుతున్న హింసాకాండ ప్రబలమై అనేక మంది ఆహూతులై నాయకులందరు చిత్రహింసకులోనైన సందర్భములో శాంతిదూతగా పోరాటం సాగించి మానవజాతికి సర్వ సంపూర్ణమైన స్వాతంత్ర్య సంపాదనలో జరిగిన కార్యక్రమాల గురించి కొంత పరిశీలించవలసియున్నది

బ్రిటిష్ ప్రభుత్వానికి ముందు రాజుల రాజ్యములో "ధర్మం" నాల్గుపాదముల నడుస్తున్నప్పటికి యేదోఒక సమస్య పై ప్రజలు ప్రభుత్వముతో వ్యతిరేకిస్తూవుండిరి.

తర్వాత రాజుల రాజ్యం పోయి బ్రిటిష్ ప్రభువులు మనదేశములో చొచ్చుకొని పాలించుకాలములో ముఖ్యంగా హిందూవులు మహమ్మదీయులనే బేదాభిప్రాయములు కలుగుతూ వచ్చెను. ఇట్టి బేదాభిప్రాయములను బ్రిటిష్ ప్రభువులు గుర్తించి మనలను రెచ్చగొట్టుతూ తమ అధికారము స్థిరపరచుకొంటూ వచ్చిరి మనదేశ పూర్వాచారపద్ధతులలో ముఖ్యముగా సతీసహగమనం అనగా భర్త చనిపోతే భార్యకూడా భర్త చితిలోబడి దహనమగుతూ వచ్చెను. ఇట్టి సందర్భములను పురస్కరించుకొని రాజా రాం మోహనరాయు లాంటి పెద్దలు యీ విధానం ఖండిస్తూ కొంతకాలానికి సమాజములో మార్పుకాబడినది. యీ విధమైన సంఘ సంస్కర్తల యొక్క చైతన్యము బ్రిటిష్‌వారికి కంటకమగుతూ వచ్చెను.

1942లో కాంగ్రేసు నాయకులంతా "క్విట్ ఇండియా" ఉద్యమము సాగించి కారాగారములలో నిండిపోయిరి. మా దేశము విడిచివెళ్లండని నాయకులయొక్క నినాదములతోపాటు సామాన్యమైన ప్రజానీకమంతయు సమ్మెలు ప్రారంభింపజొచ్చిరి. తత్ ఫలితముగా 1946 లో తిరుగా బ్రిటిష్‌వారు గాంధీగారితో రాజీసూచనలు ప్రకటించినందున జహ్వార్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లబాయిపటేలు, రాజాజీ రాజేంద్ర ప్రసాద్‌గార్ల అంగీకారముతో ఇండియా-పాకిస్తాన్ యంటూ గాంధీగారికి తృప్తిలేక పోయినప్పటికి 1947 ఆగష్టు 14 అర్ధరాత్రి తర్వాత ఇండియా-పాకిస్తాన్ ప్రజలకు స్వరాజ్యం లభించెను.

యీ విధముగా దేశానికి స్వరాజ్యం లభించినప్పటికి హిందూ మహమ్మదీయ ద్వేషము మక్కుటమై పశ్చిమ బెంగాలు ప్రాంత మంతయు హింసాకాండ ప్రభలమై 1948 జనవరి 30 తేది నాడు మత ద్వేషముతో గాంధీగారు ఢిల్లి పట్టణ బహిరంగసభలో హత్య గావించబడిరి.

గాంధీజీ భారత దేశమంతయు ఏక కుటుంబముగాకలలు గంటూ వుండిరి భారత స్వాతంత్ర్యానికై అనేకమైన ఆటంకములు జరుగుతూ వచ్చెను, నాయకులలో అతివాద - మితవాదులుగా ప్రసిద్ధికెక్కిరి కాంగ్రేసు అధ్యక్షుల ఎన్నికలలోకూడా పోటీలు జరుగుతూ భారత నాయకులలో అగ్రగణ్యుడైన సుభాస్ చంద్రబోసు పోటీచేయడము తర్వాత ప్రత్యేకముగా "ఆజాద్‌హింద్" ఫౌజు నిర్మాణ మొనర్చి దేశ విదేశములలో తీవ్రమైన కృషి సాగించబడి వుండెను.

గాంధీజీ కాంగ్రేసు నాయకత్వం కావలయునంటూ కోరకపోగా సామాన్య సభ్యత్వముకూడా పొందలేదు కాని పోటీ జరిగినపుడల్లా కాంగ్రేసు సిద్ధాంతముపై విశ్వాసము కలిగి పనిచేయువారినే బలపరస్తూ వచ్చిరి. ఇదేవిధముగా కమ్యూనిష్టు - సోషలిస్టు పార్టీలకుకూడా స్వాతంత్ర్యమే ప్రధాన ధ్యేయముగా ఉండినందున గాంధీజీ అందరి దృష్టిలో అభిమానము చూరకొంటూ వచ్చిరి.

ఇకపోతే భారతదేశములో నొక భాగమైన అధిక జనాభాతో కూడిన మహమ్మదీయుల ప్రాంతము 5 కోస్తాలకు నాయకుడుగా జిన్నాగారు ప్రత్యేకముగా పాకిస్తాన్ కావలయునంటూ పోటీచేయడముతో అనేక ఇబ్బందులకు గురికావలసి వచ్చెను. ఇండియా జనాభలో మహమ్మదీయులదే మిక్కుటముగా జిన్నాగారు ప్రకటిస్తూవచ్చిరి. తత్కారణముతో జనాభా లెక్కలు తయారు చేయడములో బ్రిటిష్‌వారు చెట్ల క్రిందను గ్రామాలకు దూరముగా వున్న ఆనాటి మాల మాదిగెవారిని లెక్కింపకుండా వచ్చిరి హిందూవుల సంఖ్యాబలము మిక్కుటమని గాంధీగారూ సవాలుచేస్తూ ఏడుకోట్ల మాల మాదిగె వారందరిని జనాభా లెక్కలలో పొందుపరచి వారందరికి హరిజనులని నామధేయముతో వారి సంక్షేమానికై ప్రత్యేకమైన కృషి ప్రారంభించి "హరిజన పత్రిక" ప్రధానకార్యదర్శిగావుండి నిరంతరమైన సేవాకార్యక్రమం నడిపించుతూ వచ్చిరి యీ విధముగా గాంధీగారు అప్పటికపుడు నూతన విధానములను ప్రవేశపెట్టుతూ తాను నోటితో చెప్పినదల్లా కార్యరూపేణా జీవితం సాగించుకొంటూ ఒక్కొక్కరోజు మేకపాలనే ఆహారముగా నిర్ణయించుకొని స్వయముగా వడికిన నూలు వస్త్రిమును మోకాళ్లవరకూ ధరించుకొంటూ భారత ప్రజలందరికి కావలసిన కూడు గుడ్డ లభించునాడే

సంపూర్ణ ఆహారం - వస్త్రం నాకు అవసరమంటూ బ్రిటన్‌లో జరుగు సమావేశముల్లోకూడా ప్రకటిస్తూవచ్చిరి యీ విధముగా గాంధీగారి విధానం పరిశీలించిన తర్వాత గాంధీగారిని మహాత్మునిగా తలంచి 'మహాత్మా'యంటూ పిలువసాగిరి క్రమేణా విదేశాలనుండి మన దేశమునకు వచ్చువారందరు గాంధీగారిని చూచిపోవడం కొంత మందికి ప్రధానముగా వుండెను.

బ్రిటిష్‌వారు గాంధీయొక్క గొప్పతనాన్ని పరిశీలించిన తర్వాత కాంగ్రేసు అగ్రనాయకులకు జహ్వార్‌లాల్ నెహ్రూగారు గాంధీగారిని వెంబడిస్తూ నిరంతరమైన ఆలోచన-రహస్య--సందర్భములలో నెహ్రూగారు ప్రధానమైన వారుగా వుండిరి. మరియు దేశంలో "గాంధీఇజం" ప్రకాశించి పనిచేయుటకై వారి కుమార్తెయగు "ఇందిరా" నామధేయముచే పిలువబడు నేటి ప్రధాని "ఇందిరాగాంధిగా" వ్యవహరింపచేస్తూ క్రమేణా కుటుంబములో వారందరి నామధేయములలో గాంధి నామ స్మరణ ఉపయోగించుతూ వారి భక్తి శ్రద్దను నిరూపించుకొన్నారు. మరియు శ్రీ మాన్ రాజగోపాలాచారి తన కుమార్తెను గాంధీ కుమారునికిచ్చి వివాహము జరిపించినారు.

యీ విధముగా మన భారతదేశమునకు 1947 లో స్వరాజ్యం లభించిన తర్వాత మన దేశము మనమే పాలించుకోవలసిన యీ సందర్భములో కాంగ్రేసు పార్టీని రద్దుచేసి-నైతిక-ఆర్థిక-సాంఘిక సేవా కార్యక్రమాలకై పనిచేయు సేవా కార్యకర్తలతో "లోక్ సేవా సంఘము"ను స్థాపించినడిపించు కోవలసినదిగా ప్రకటిస్తూ వచ్చిరి, కాని స్వరాజ్యం రాగానే ప్రత్యేకముగా రాజ్యాంగ నిర్మాణము రూపొందించు కోవలసి వచ్చెను. దేశములోనున్న ఏస్టేట్-మరియు జమీందార్లు 560

సంస్థానాల గురించి ఆలోచించవలసి వచ్చెను. యీ విధముగా మిక్కుటమైన బాధ్యతలు కాంగ్రేసు నాయకులు నిర్వహింపవలసి వచ్చెను యీ విధముగా అనేక సమస్యల నెదుర్కొంటూ గాంధీజీ అధ్యాత్మిక శక్తితోపాటు. వారి విధానం మూలబడి దేశమునందు అన్యాయము - అధర్మము మిక్కుటముగా పనిచేయుచున్నదని ప్రజలు భావిస్తూ, ధర్మానికై నిరీక్షింపు చున్నారు.

"ధర్మ సంస్థాపన నార్థాయ సంభవామి యుగే యుగే" అన్నట్లు ద్వాపరయుగంలో. కృష్ణుని తర్వాత పాండవులు పాదయాత్రతో వైకుంఠము సంపర్కించడము, వారి సంతతియగు పరిక్షితుడు జయమే జయుడు రాజరాజ నరేంద్రుడు-సారంగధరునితో పూర్తికాబడి, కలి పురుషుడు, అవతరించడముతో కలియుగము. ప్రారంభమైనట్లు చరిత్ర కారులచే ప్రకటించ బడుచున్నది.

యీ విధముగా కొంతకాలమునకు దేశములో విషమ పరిస్థితులు సంభవించడము బుద్ధభగవాన్ అవతరించి "అహింసా పరమో ధర్మం" అంటూ ధర్మప్రచారము సాగించబడినది. తర్వాత విరాట్ పోతులూరు వీరబ్రహ్మేంద్రస్వాములవారు తన కాలజ్ఞానములో ఉత్తర దేశములో కోమటి ఇంటిలో గాంధీగారు అవతరిస్తాడని ముందుగానే వ్రాయబడి వున్నది, అదేవిధముగా దేశకల్యాణమునకై శాంతిదూతగా సత్యం - అహింసా-సిద్ధాంతముతో బ్రిటిష్‌వారిని సాగనంపి దేశ ప్రజల కొసంగిన స్వరాజ్య రధములో గాంధీ అనచరులచే రామరాజ్య నిర్మాణమునకై దీక్షాబద్ధులు కండని, వినోబాజీ పిలుపు నిస్తున్నాడు.

జై జగత్.

# భారత స్వాతంత్ర్య సమరములో ఆంధ్రుల పాత్ర

అఖండ భారత స్థాయిలో గాంధీజీ నాయకత్వమున జరుగుతున్న యీ పోరాట సందర్భములో ప్రత్యేకించి ఆంధ్రులయొక్క కార్యక్రమాలను క్లుప్తముగా ప్రకటిస్తాము:

దేశ స్వాతంత్ర్యం కొరకు జరిగిన జాతీయ పోరాటములో ఆంధ్రులు మహోజ్వలమైన పాత్రవహించారు, హైకమాండు నిర్ణయించిన విధానాలను, కార్యక్రమాలను ఆచరణలో పెట్టడంలో ఆంధ్రులు ఎప్పుడూ ముందడుగునే వేశారు, అంతేకాదు అనేక సందర్భాలలో హైకమాండు నిర్ణయించే విషయాలను ముందుగానే వూహించి స్వయముగా చొరవతీసుకొని ఎన్నోవిధానాలను కార్యరూపంలో పెట్టినారు

దేశ స్వాతంత్ర్య సమరం అనేక దశలలో నడిచిన విషయం సర్వజన విదితమే 1905 వరకు అర్జీలు, వినతి పత్రాలు సమర్పించిన దశ వుండింది. ఆ తరువాత 1905 నుండి 1911 వరకు వందేమాతరం ఉద్యమం నడిచింది. 1916 నుండి 1918 వరకు హోంరూల్ వుండింది 1921 22 లో సహాయనిరాకరణోద్యమం. 1930-34 వరకు ఉప్పు సత్యాగ్రహం జరిగినాయి 1942లో క్విట్ ఇండియా ఉద్యమం జరిగింది. ఈ అన్నిదశలలోకూడా ఆంధ్రులు అగ్రగాములై వుండి ఉత్సాహం, పట్టుదల, కార్యదీక్షతో దేశంకోసం చిరునవ్వుతో ఎన్నో కష్టాలు అనుభవించారు. ఎన్నో త్యాగాలు చేశారు.

స్వాతంత్ర్యసమరం మొదటిదశ తర్వాత ఆంధ్రులు జిల్లా సంఘాలను స్థాపించి ఇండియన్ నేషనల్ కాంగ్రేసు నిర్దేశించిన విధానాలను పను లను స్థానికంగా కొనసాగించారు, వార్షిక మహాసభలు, సమావేశాలు విధిఫలితంగా ప్రజలలో చైతన్యం వచ్చింది. విదేశీ పరిపాలన క్రింద జరుగుతున్న అన్యాయాలను ప్రజలు తెలుసుకొనగలిగినారు. ఈ విష యంలో తాము చేయవలసిన పనిని వారు గుర్తించారు.

బెంగాలు రాష్ట్ర విభజన జరిగిన వెంటనే, బిపిన్ చంద్రపాల్ ఆంధ్రకోస్తా ప్రాంతాలలో పర్యటించి కాకినాడ, రాజమండ్రి, మచిలీ పట్నం వంటి ప్రధాన పట్టణాలను సందర్శించారు దేశానికి స్వరాజ్యం రావలసిన అవసరాన్ని ఆంధ్రులు అర్థంచేసుకున్నారు బ్రిటిష్ వస్తువుల బహిష్కరణ, స్వదేశీ ఉద్యమం జాతీయ పాఠశాలల స్థాపన. ఈ లక్ష్య సాధనకు ఉపకరణములని వారు గుర్తించారు. ఈ ఉద్యమంలో విద్యా ర్థులు చాల ప్రముఖ పాత్రవహించారు. రాజమండ్రి ప్రిన్సిపాలు ఉత్త రువులనుత్రోసి రాజని 138 మంది విద్యార్థులు వందేమాతరం బ్యాడ్జిలను ధరించారు. తత్ఫలితంగా వారు కాలేజినుంచి వెల్లగొట్టబడినారు. వారిలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఒకరు. తరువాత 10 సం॥లలో ఆయన ఆంధ్రలో దేశస్వాతంత్ర్య సమరంకొరకు పోరాడిన మహానాయకులలో ఒకరుగా రాణించారు 1908 లో కాకినాడలో అల్లరులు చెలరేగినాయి. ఈ సంఘటనలు ప్రజల్ని ఉద్రిక్తపరచినాయి ఈ అల్లరులు జరిగినందుకు ప్రభుత్వం కాంగ్రేసువారిని శిక్షించగా అందుకు నిరసన తెలుపుతూ, అసంతృప్తిని ప్రకటిస్తూ అనేకమంది కార్మికులు సమ్మెచేశారు ఈ ప్రాంతంలో స్వదేశీ దుకాణాలు తెరువబడినాయి. కొంత మంది యువకులు ఆధునిక పారిశ్రామిక పద్ధతులు నేర్చుకొనడానికి జపాను తదితర దేశాలకు వెల్లినారు. ఈ కాలములోనే మచిలీపట్నములో సుప్రసిద్ధమైన ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపించబడింది.

బెంగాలు విభజన చట్టానికి సవరణ జరగడముతో 1911 లో "వందేమాతరం" ఉద్యమం ముగిసిన తరువాత ఆంధ్రులు ఆంధ్రోద్యమమని ఒకకొత్త ఉద్యమాన్ని ఆరంభించారు. ఆంధ్రుల అభ్యున్నతి భాషాప్రాతి పదికపైన ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రము ఏర్పడడం ఈ ఉద్యమం ప్రధానోద్దేశం. దీనితో ఈ ప్రాంతములో రాజకీయ చైతన్యం ప్రబలింది. మితవాదులు, అతివాదులు కలిసికట్టుగా ఈ ఆశయాల కొరకు పనిచేశారు.

1916 లో అనిబిసెంట్ హోంరూల్ ఉద్యమాన్ని ఆరంభించింది ఇందుకొరకు ఆంధ్రశాఖ ఒకటి తెరువబడింధి. దీనికి హరిసర్వోత్తమ రావు కార్యదర్శి అయినారు. అనేకమంది ఆంధ్రులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ఈ ప్రాంతంలో సుమారు 55 శాఖలు వెలసినాయి. అనిబిసెంట్ ఆమె అనుచరులు నిర్బంధములో వుండినపుడు. ఆంధ్రులు ముందుకువచ్చి ఆమె విడుదలకొరకు సత్యాగ్రహం చేశారు. ప్రజలలో రాజకీయ చైతన్యం ప్రబలడానికి ఆంధ్రరాష్ట్రోద్యమం, హోంరూల్ ఉద్యమం, ప్రధాన కారణాలు.

ఇదే విధముగా ఆంధ్రదేశములో విప్లవయోధుడు శ్రీ అల్లూరు సీతారామరాజు పశ్చిమ గోదావరి జిల్లాలో 1897 లో జన్మించి స్వాతంత్ర్యమునకై తీవ్రమైన ఉద్యమము సాగించి 1924 లో బ్రిటిష్‌వారిచే కాల్చివేయడం జరిగినది 1920 నుండి ప్రత్యేక రాష్ట్ర నిర్మాణమునకై తీవ్రమైన కృషిసాగించి 1952 లో ఆమరణ నిరాహార దీక్షతో 1952 డిశంబరు 15 తేది శ్రీ పొట్టి శ్రీరాములు ప్రాణమును కోల్పోయిరి.

# ముగింపు

ప్రపంచ రాజకీయ చరిత్రలో ముఖ్యముగా మన భారతదేశమందు కలిగిన చైతన్యఫలితం, కాలనుగుణముగా మారుతున్న నేటి సమాజంలో విజ్ఞానముకూడా విపరీతముగా పెరిగిపోతున్నది. కాని పెరిగిపోతున్న విజ్ఞానము సమాజమునకు యెలా ఉపయోగపడుచున్నది. కొంత పరిశీలింతము.

మన దేశమునందు కులాలకు–మతాలకు కొరత లేదు. మతాల కనుకూలమైన భాషలు – భాషలకు తగిన వేషాలు – వేషాలకు తగిన మాటలు – మాటలకు తగిన ప్రవర్తన ఒకదాని కొకటి సంబంధం పెట్టుకొని కలగూర గంపగా జాతీయ విజ్ఞానం కుంటుపడుతూ వున్నది.

"దైవం మానవ రూపేణా" అన్నటువంటి "శృతి"ని పక్కకు నెట్టి మానవునికి మించిన మరియొక దేవుడున్నాడనియు, దేవుడే మానవుని కాపాడుతున్నాడనియు మానవుడు మానవుని ప్రేమించకపోగా, అన్నిటికి దేవుడంటూ నిందలుమోపి రాక్షస చర్యలు సాగించుతూ మానవ సమాజమునకే, కళంక మాపాదించబడుచున్నది.

మరియు నేటి విజ్ఞానవేత్తలు, కొంతమంది పరిశోధకులు మన రామాయణం భారతము కల్పితమన్నట్లు ప్రకటిస్తున్నారు అదియునుగాక మన రామాయణ మంతయు ఒక విషవృక్షముగా రూపొందించ బడినదని కొంతమంది కవులచే వ్రాయబడివున్నది.

ఇకపోతే నేటి సినిమాల ప్రభావమేమో, సినిమా యనగానే, ఎగబ్రాకుచున్నారు. వీటివల్ల నేర్చుకొంటున్న విజ్ఞాన మేలాంటిదో ఆలోచించి నిర్ణయించుకోవలసివున్నది.

పూర్వము మనకవులు-పండితులు రచించిన రామాయణ-భారత గ్రంధములనేకములున్నవి. వాటిలోనున్న మన భారతీయ సంస్కృతి ముఖ్యమైయున్నది. మరియు నవల్సు-డిటెక్టివ్‌లు — కూడా పాఠకులకు ప్రీతికరమైయున్నవి. అసభ్యకరమైన ప్రచురణలు ప్రభుత్వం నిషేధించుతూవున్నది.

మనకు స్వాతంత్ర్యము లభించిన తర్వాత విద్యావిధానం మారవలయునంటూ పెద్దలంతా ప్రతిపాదించుచున్నారు. మరియు నేటి విద్యార్థులుకూడా ఉపాధ్యాయులతో పోటీపడుతున్నారు. రాత్రింపగళ్లు కష్టపడి చదువుకొన్నప్పటికి పరీక్షలకాలములో ప్రభుత్వ బందోబస్తు కావలసివున్నది.

భారత దేశ స్వాతంత్ర్య పోరాటములో మహాత్మగాంధీ "జైహింద్" నినాదమిస్తె-నేటి వినోబా "జై జగత్" నినాదమిస్తున్నారు. గాంధీ వినోబా రచించిన గీతాసారం, ప్రపంచానికే ఆదర్శప్రాయమైయున్నది భూదాన రజతోత్సవాల పురస్కరించుకొని (1976 ఏప్రెల్) రాష్ట్రపతి ఉపరాష్ట్రపతి, భారత ప్రధాని తమ తమ సందేశములవిస్తూ పాద యాత్ర కార్యక్రమం జరిపించినారు. కాంగ్రేసు అధినేతలు భూదాన సాహిత్యం నేటి ప్రజలకు ప్రియమైనదిగా స్వీకరించియున్నారు. గాంధీజీ తలపెట్టిన బేసిక్ విద్యావిధానము-గ్రామ స్వరాజ్య నిర్మాణములో అనేక సమస్యలు పరిష్కారం కాగలవని ఆశించబడుచున్నది.

ఇందులో ప్రకటించబడిన, గాంధీగారి ఆధ్యాత్మికశక్తి ప్రభావము స్వాతంత్ర్య పోరాటముయొక్క కార్యక్రమం ప్రత్యేకించి ఆంధ్రుల యొక్క పాత్రను, గురించి, కాలాను గుణ్యముగా మారుతున్న నేటి సమాజములో విద్యార్థులకు కూడా అత్యావసరముగా భావించుతూ, ముగింపు చేయబడుచున్నది.

# ఆర్థిక స్వాతంత్ర్యముకై
# శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 సూత్రములు

1. నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించటానికై నిరంతర కృషి, అధికోత్పత్తి, సాధన, నిత్యావసర వస్తువుల సేకరణ, పంపిణీ ప్రభుత్వ వ్యయంలో పొదుపు.

2. వ్యవసాయ కమతాల మీద గరిష్ఠ పరిమితులు విధించి అమలు జరపటం, మిగులు భూమిని త్వరిత గతిని పంపిణీ చేయటం. భూమి లెక్కలు తయారు చేయుట.

3. భూమిలేని వారికి, బలహీనవర్గాల వారికి ఇండ్ల స్థలాలను త్వరిత గతిని మంజూరు చేయుట.

4. వెట్టిచాకిరి ఎక్కడవున్నా బహిష్కరిస్తూ చట్టంద్వారా ప్రకటించడం

5. గ్రామీణ బాకీలను, రద్దుపరచే ప్రణాళిక – వ్యవసాయ కూలీలు సన్నకారు రైతులు, చేతి వృత్తుల వారినుంచి బాకీల వసూళ్ళను తాత్కాలికంగా ఆపుదలచేస్తూ శాసనం చేయుట.

6. కనీస వ్యవసాయ కూలికి సంబంధించిన చట్టాలను పునఃపరిశీలించటం.

7. ఒకకోటి 25 లక్షల ఎకరాలకు అదనంగా నీటిపారుదల సౌకర్యం కల్పించుటకు భూగర్భంలో వున్న నీటినుపయోగించుకొనే జాతీయ పథకం,

8. తీవ్రగతిని అమలు జరుపనున్న విద్యుదుత్పత్తి కార్యక్రమం – కేంద్ర ప్రభుత్వ అధీనంలో సూపర్ థర్మల్ పవర్ స్టేషన్లు నెలకొల్పుట.

9. చేనేత పరిశ్రమ నభివృద్ధిపరచే నూతన అభివృద్ధి ప్రణాళిక

10. సామాన్య ప్రజలు ఉపయోగించే గుడ్డలు నాణ్యతను, సరఫరాను పెంపొందించుట.

11. పట్టణ భూములను సాంఘిక పరం చేయుట–ఖాళీ స్థలాల మీద క్రొత్తగా కట్టబడే ఇండ్ల స్థలాలమీద గరిష్ఠ పరిమితిని విధించుట

12. విలాస కట్టడాల విలువ నిర్ణయించడానికి ప్రత్యేక సిబ్బంది బృందాల నియమించుట, పన్నుల యెగవేత నరికట్టటం. ఆర్థిక సంబంధమైన అక్రమాలు జరిపేవారిని పట్టుకొని వెన్వెంటనే విచారించుట, తీవ్రమైన శిక్షలు విధించటం.

13. దొంగ రవాణాదార్ల ఆస్తుల స్వాధీన పరచుకొనే ప్రత్యేక శాసనాలు చేయుట.

14. పెట్టుబడి పద్ధతుల కట్టుబాట్లను సడలించటం దిగుమతి లైసెన్సుల దుర్వినియోగం జేసేవారి మీద చర్యలు తీసుకొనుట.

15. పరిశ్రమల యాజమాన్యంలో కార్మికులకు పాత్రను కల్పించే క్రొత్త పథకం.

16. రోడ్డు ట్రాన్సు పోర్టులో జాతీయ పర్మిట్ల నిచ్చే పథకాన్ని ప్రవేశ పెట్టటం.

17. మధ్యతరగతి ప్రజానీకం మీద ఆదాయపు పన్ను సడలింపు. పన్ను విధింపు కనీస ఆదాయపు పరిధిని 8 వేల రూపాయలకు పెంచుట.

18. విద్యావసతి గృహల్లో వుండే విద్యార్థులకు కంట్రోలు ధరలకు నిత్యావసర వస్తువుల సరఫరా.

19. పుస్తకాలు, స్టేషనరీ వస్తువులను కంట్రోలు ధరలకు లభ్యమగు నట్లు చూచుట.

20. ఉపాధి శిక్షణలను–ముఖ్యముగా బలహీన వర్గాలవారికి – అధిక తరం చేయుటకై క్రొత్త "అప్రెంటిస్ షిప్" (ఉపాధితో కూడిన శిక్షణ) పథకం.

# రాజకీయ స్వాతంత్ర్యమునకై
# గాంధీజీ నిర్మాణ కార్యక్రమ సూత్రములు 18

---

1. వివిధ మత సంఘముల ఐక్యమత్యత.
2. భాషా ప్రయుక్త రాష్ట్రముల నిర్మాణము.
3. హరిజనోద్ధరణ.
4. మధ్యపాన నిషేధము.
5. ఖాదీ.
6. స్త్రీ జనోద్ధరణ.
7. గ్రామ శుభ్రత.
8. కుటీర పరిశ్రమలు.
9. వయోజన విధ్య మరియు ఓటింగ్.
10. ఏకైక జాతీయ భాష.
11. వివిధ ప్రాంతీయ భాషల అభివృద్ధి.
12. గ్రామ పారిశుధ్యము.
13. ఆర్థిక సమత.
14. ప్రాతిపదిక విధ్యా విధానము.
15. కార్మిక జనోద్ధరణ.
16. ఆదిమజాతి వాసులగు అడవి జాతివారి ఉద్ధరణ.
17. రైతు సంఘముల అభివృద్ధి.
18. కుష్ఠురోగ నివారణ.

# ఇంద్ర ధనస్సుతో కలాడిన 20 సూత్రముల గురించి

## 4 రత్నములు

రా రాజు లందరు - దేశమే మాదంచు
వాపోవు చుండిరి - వసుధలోన
ధనిక భూస్వాములు - డంబంబు విడనాడి
లొంగిపోయిరి — నేడు. సామ్యమొప్ప
అగ్రజాతులటంచు - అన్ని వేళలయందు
పెద్దగా నెంచెడు — పౌరుషంబు
బలహీనమగుచున్న - భారత దేశంబు
ప్రఖ్యాతి గాంచెను — నీదు కృపచె
వైశ్య జాతిలో — వాసవి కరుణతోడ
అవతరించితివయ్యా - ఓ గాంధీ తాత
నీదు సంకల్ప మెట్టిదో - నిజముగాను
జెప్పబూనితి ధరణిలో - దైవకృపచె
ఇరువది సూత్రముల్ — విజయ మొందిన నాడు
విద్యా విధానంబు - వరుసతోడ
ఇరువది సూత్రముల్ — విజయ మొందిన నాడు
దారిద్రముండదు - ధరణిలోన
ఇరువది సూత్రముల్ - విజయ మొందిన నాడు
అజ్ఞాన మెంతైన - వుండబోదు
ఇరువది సూత్రముల్ — విజయ మొందిననాడు
పేదల రాజ్యంబు — పెంపుగాను
చేయు సంకల్ప మున్నట్టి - పెద్దలారా
దీక్ష బూనంగ - రా రండి రండి నేడు

భరతమాతగ వెలసిన – ఇందిరమ్మ
ఆత్మశక్తికి జోహర్లు – చెప్పరయ్యా
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
భూస్వాములటంచు – వుండబోరు
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
బలహీన వర్గాల – భాగ్యమెప్పు
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
కూటికి గుడ్డకు – కొరత లేదు
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
అప్పు సప్పులన్ని – కరుణతోడ
పేద వర్గాలు – యీ నాటి కాలమందు
ఐక్య మత్యత – అంతట మేలటంచు
కలసి రా రండు – నేర్పుతో కలదె సుఖము
భరత మాతకు – జే జేలు చెప్పరయ్యా
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
మానవ సౌఖ్యంబు – మరువలేము
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
దేశ కల్యాణంబు – ధరణిలోన
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
ధనిక పేదయటంచు – బేదంబులేదు
ఇరువది సూత్రముల్ – విజయ మొందిన నాడు
భారత బలమెంతో – చెప్పలేము
గాన ప్రజలంత – విడువని, దీక్షతోడ
ఇట్టి సమయంబు రాదని – పట్టుదలతో
ఇందిరాదేవి శపథంబు – నిష్ఠతోడ
ఇలను సౌఖ్యంబు – చేయుడీ సురులు మెచ్చ

# రాబోవు గ్రంథము

( వివరాలు సేకరించ బడుతున్నవి )

ఆనాడు శ్రీ కృష్ణ భగవాన్ అర్జునుడి కుపదేశించి
18 అధ్యాయముల గీతోపదేశంతో
పాండవులు విజయసాధకులై స్వరాజ్యం పొందిరి



యీ నాడు మహాత్మాగాంధీ – జవహరులాల్ నెహ్రూ
కుపదేశించిన 19 అధ్యాయముల నిర్మాణ కార్యక్రమం
రాజకీయ స్వాతంత్ర్యం సాధించబడెను.

## నేడు

గాంధీజీ – నెహ్రూ 18 అధ్యాయముల చరిత్రలో సాధిం
రాజకీయ స్వరాజ్య రథములో
ఇందిరాగాంధీ – ఇంద్రధనస్సుతో
ఆర్థిక స్వాతంత్ర్య సమ సమాజ నిర్మాణమునకై
20 సూత్రముల "ప్ర భా వ ము" గురించి
తెలియజేయు గ్రంథమే

# "గాంధీ - ఇందిరాగాంధీ ధర్మ సూత్రములు"

# ఆకాంక్ష

1. చెప్పు మాటలకును చేయుచేతలకును
పొత్తు పొసగక ఎత్తుకు నెత్తువేసి
పబ్బమును గడుపుకొనెడి పెద్దలైరి
మరిచినారలు గాంధీజీ మార్గమెపుడొ.

2. ఉండిరెందరొ నేతలీయుర్విలోన
ఇల "మహాత్ములై" వారలు వెలసినారె?
అడ్డదోవతి దాల్చిన దొడ్డనేత
కడునిరాండబరుడు మాదు గాంధీతాత.

3. చిమ్మచీకటియందున చిన్నదివ్వె
ఉత్తమంబగు – ఈ చిన్నిపొత్తమటులె
జనులగాంధీజీ మార్గాన జనగజేయ
సార్థకంబగు నీ కృషి స్వామిగుప్త!!

మీ శ్రేయోభిలాషి,

బి. నాగభూషణరెడ్డి

విశ్వహిందూ పరిషత్తు

కడప జిల్లా శాఖ.

# సర్వోదయ విద్యాపీఠం, H. బద్వేలు కడప జిల్లా.

## ద్వితీయ ముద్రణలో అభిమాన సభ్యులు

| | |
|---|---|
| శ్రీ నిచ్చెనమెట్ల కుమారస్వామిరాజా | ప్రొద్దుటూరు. |
| శ్రీ పి. పెద్ద వెంకటేశం గారు | ,, |
| శ్రీ టి. చంద్రశేఖరశర్మ | ,, |
| శ్రీ వి. నీలకంఠారెడ్డి, గణేష్ ఆయిల్ మిల్లు | ,, |
| శ్రీ మాకం రామాంజనేయులు శ్రేష్ఠి బ్రాండిషాపు | ,, |
| శ్రీ విజయా ట్రేడింగ్ కంపెని (న్యూ ఫరమ్) | ,, |
| శ్రీ చింతకుంట వెంకటసుబ్బయ్య, రామక్రిష్ణ ఏజన్సీ | ,, |
| శ్రీ జయం బాలవెంకటసుబ్బయ్య | ,, |
| శ్రీ డి. క్రిష్ణమూర్తి L. I. C. ఆఫీసర్ | ,, |
| శ్రీ కాకుమాని క్రిష్ణయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ సాధు రామసుబ్బన్న | ,, |
| శ్రీ మోపూరి తిరిపేలు రెడ్డి | ,, |
| శ్రీ మునగా శేషయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ పూటుకూరు వీరయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ రాధాక్రిష్ణ శిల్కు హౌస్ బి. గురప్ప శ్రేష్ఠి | ,, |
| శ్రీ మాలేపాటి మునిరామయ్య శ్రేష్ఠి | మైదుకూరు. |
| శ్రీ పుల్లగూర చిన్నగోవిందప్ప శ్రేష్ఠి | యర్రగుంట్ల |
| శ్రీ తాతా నరసింహులు శ్రేష్ఠి | ,, |
| శ్రీ మేడా సుబ్బరావు శ్రేష్ఠి | ,, |
| శ్రీ వడ్లకుంట వీరయ్య కుమారుడు రాచయ్య శ్రేష్ఠి | వేంపల్లి |
| శ్రీ రాయవరం గంగయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ దారా పడిగెలయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ దోనిపర్తి రామయ్య కుమారుడు సుబ్బయ్య శ్రేష్ఠి | దువ్వూరు |
| శ్రీ లింగం రామయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ మేడం సుబ్బరాయులు శ్రేష్ఠి | ,, |
| శ్రీ ఆర్వేటి వెంకటసుబ్బయ్య కు॥ రామయ్య శ్రేష్ఠి | ,, |
| శ్రీ ఆర్వేటి పెద్దసుబ్బయ్య కుమారుడు రామయ్య శ్రేష్ఠి | ,, |